

# ANUBHAVA SUDHANIDHI.

FOR THE USE OF BOYS & GIRLS.

BY

**Palepu Bangararaju.**

---

Rajahmundry:

Printed at the chintamani printing works.

1910.

—

Price 2 Annas.

శుభమస్తు.

# అనుభవసుధా [redacted]

ఇది

ప్రస్తుతము రాజమహేంద్రవరపు [redacted]

## పాలెపు - బంగారరాజుచే

రచియింపఁబడి

ఇప్పుడు ఆర్ట్సుకాలేజిలోఁ బ్రధానసంస్కృతపండితు లగు

బ్రహ్మశ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులవారిచేఁ

పరిష్కరింపఁబడినది.


రాజమహేంద్రవరము.

యస్. గున్నేశ్వరరావు బ్రదర్సువారి

శ్రీ చింతామణి ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

**1910.**

PRICE 0-2-0] [వెల 0-2-0.

శ్రీ వేంకటరమణ

# అనుభవసుధానిధి.

క. శ్రీపార్వతిప్రియతనయుఁడె
నాపాలిటిమొదటివేల్పు! నాయత్నముసం
దేపాటిలోటు లేకయ
నాపని తుద గాంచ వేయినతు లొనరింతున్. 1

తే. గీ. పాలుమాలిక విడి కాలము గడపినఁ
జాలమేలు గల్గు జగతియందు
మేలు మఱవరాదు మేదిని నెవ్వరైన
వేలకోలఁదిధనము వెలసియున్న. 2

క. కాలము దాఁట నశక్యము
ఫాలాక్షునకైన ధరణిపాలునితరమే ?

కాలము దుర్వినియోగం బే
పోలికఁ జేయంగఁ దగదు బుద్ధియుతులకున్. 3

క. శ్రీధరుకృపచేఁ గలిగి ర
సాధారంబైన నీర మానుటదక్క
భూధనము లాభ మొసఁగ ద
సాధర్మ్యం బరసి చూడు సకల ధరిత్రిన్ 4

ఆ. గీ. కష్టపడెడువాఁడు కష్టమె పడుచుండుఁ
గష్టజీవి కెట్లు కలుగు సుఖము?
స్రష్ట వ్రాఁత దాఁట కష్టసాధ్యమె కాని
కాయకష్టములను గడవవలయు. 5

ఆ. గీ. పాటుపడినవారు ఫలభాగు లవుదురు
సాగుపనిని ముగియ జరపలేక
యాటపాటఁ జూడ నభిలషించెడివారు
బూటకమునఁ బ్రొద్దు పుచ్చుచుంద్రు. 6

ఆ. గీ. ఉగ్గుఁ బోసి ప్రొద్దు నుదయపు
వేళ దప్పకుండ వేగమునను
వేఁడినీళ్ళు పోసి ప్రేమఁ జన్ని
తల్లి నిసుఁగునకును దైవ మర

క. శిశురోదన మెవరికి నే
నశమా వారింపఁ దల్లివశమా నెందున్
విశలుం బవళులు నోపిక
నశియింపక విసుగులేక నమ్మిక నరయున్. 8

ఆ గీ. పట్టుబట్ట గట్టి పక్కన నవ్వుచుఁ
జెట్టఁ బట్టువాని చెంగనాడి
కొట్టఁ దిట్టఁ బోయి క్రమ్మరించెడు వెండ్ల
మిట్టిభుక్త మెన్న నెట్టుహితము. 9

క. భూదేవి తల్లి కెనయా
నేదేవుఁడు గానరాఁ డిఁ కెందును వెదకన్

లేదేని పంట కాపుల
కేదారియు లేద మొఱలు పెచ్చుట వినమే. 10

క. పేదరిమి నలఁగువారల
కాదరమున నన్న మొసఁగ నతిమోదం బౌ
లే దనక మాధుకర మిడ
శ్రీదారునిదయ నెసంగు సిరిసంపదయున్. 11

క. తాను దలంచిన పనులకు
నేనరుఁడే నడ్డపడిన నెంతో కినుకం
బూని కడు మండిపడు నీ
శానుకృప వివేకియైన శాంతుఁడు కాఁడే? 12

క. మానము దుస్సహనాసము ;
మానవుఁడై పుట్టు పెల్ల మర్యాదకుఁగా
మానావమానము ల్సరి
గా నేమానుషులయందుఁ గానము ధాత్రిన్. 13

క. నలినాసనుఁ డెచ్చటనో
గలఁ డాతని వ్రాఁతఫలము గనఁబడు మనకుం
గలకాల మెట్టినగుఁడును
వలయున్ గడపంగఁ గర్మవశతవిసీతిక్. 14

క. అలవశీనపనులు చేయుట
సులభము మఱి దానికంటె సులువని చూడన్
గలిగెడు నలంత క్రొత్తప
నుల నెపుడును గష్టపడుట నుత్యం బగునే. 15

క. కర్మమునఁ బుట్టుఁ బురుషుఁడు
కర్మమునే చేయుచుండుఁ గర్మమునఁ జెడున్
గర్మాకర్మఫలమ్ములు
నిర్మలుఁ డగువాఁడె తెలియనేర్చు నిట నటన్. 16

క. ఇహపరసాధనములు వి
త్తహావాసముచే లభించుఁ దక్కు నరులకున్

గహనాంతర్గతుఁ డనఁ దగు
నిహపరసుఖదూరుఁ డజుని సృష్టి య దేలా. 17

ఆ. గీ. చిడుము సిగ్గుఁ జెఱుచుఁ జీకొట్టి పనిమాపు
రంకుటాండ్రవిటుల రట్టు సేయు
వేఁపురుగు చెఱుచు వృక్షరాజంబును
చెడుసుతుండు పాడుసేయుఁ గులము. 18

ఆ. గీ. వైరుపంట కాఁపు పాకెఁ జేఁగించెడుఁ
బండ్లు చెట్టుగుణముఁ బ్రకటపఱుచుఁ
గాయ్యగాలు పంట చయ్యన నెఱిఁగించు
మోము దెలుపఁ జాలుఁ బురుషవృత్తి. 19

క. గచ్చే యింటికి నందము
బొచ్చే యందంబు గొఱ్ఱెపోతునకుఁ గడుఁ
కచ్చయు స్త్రీలకు నందము
కుచ్చే యందంబు జడకు గోవిందహరీ! 20

తే. గీ. ఉర్వి నొకతల్లికడుపున నుద్భవించి
జనకుద్రవ్యము భాగించుకొనుటవలన
నన్నదమ్ముల శత్రుత్వ మతిశయిల్లు
బాపురే! యేమిచెప్ప విభాగమహిమ! 21

క. ఏడాదిలోపు లేగలు
జోడుగఁ జరియించి మేసి సూటిగ రాఁగా
నేడులు పదునెనిమిది యా
నాఁడాది గడింత్రు నరులు నగుబాటొదవన్. 22

ఆ. గీ. వైభవమ్ము లున్న వల పెచ్చుసతి యున్న
మేడ లున్న మఱియు మిద్దె లున్నఁ
దగినవసతి యున్న ధనరాసు లున్నను
గొడుకు లేకపోవఁ గొదవగాదె. 23

తే. గీ. దారపుత్రులు గల్గిన ధనము సున్న
ధనము గల్గిన భోగంబు గొనుట సున్న

భోగ ముండిన బ్రతుకుట మొదలె నున్న
యున్న వనుకొను నన్నియు నున్నయెన్న. 24

తే. గీ. పొలము కదపాను బొందిన పొగస్సురైతు
చెల్లఁగట్టక వి త్తము చిక్కపెట్టు
నద్దె కింటను వసియించు నతఁడు మిగుల
నలఁత గలిగించుఁ దఱి తప్ప కర్థ మిడక. 25

క. పతియే దైవంబని తన
సతి యనుకూలత మెలంగు సౌరు కలిగనే
నతిశయ మదృష్టవశ మీ
క్షితిఁ గష్టము లొందు వానిఁ జేర న్వెఱచుఁ. 26

తే. గీ. సు ప్తిసాగిన నెంతయో సుగముఁ జెందుఁ
దిండి తిన్నను మేనికి తేటువచ్చుఁ
దెరువు దొరకిన నింపుగఁ దిరుగవచ్చు
మనుజునకు మేలు గలిగించు మాన్యపదము. 27

తే. గీ. దొంగ కెప్పుడు దోచుకోఁ దోఁచు ధనము
పై స్వైరిణి తలంచు నెప్పుడు జారగుణము
మద్యపాయి దలఁచు సుమధురి మద్యె
జూదగానికిఁ బంటమె మోదమగును. 28

ఆ గీ. వ్రాఁతకాఁ డెపుడును వదలఁడు కలమును
గన్నగాడు కనఁడు కత్తిమఱపు
బంకులాఁడి చెప్పు రమణులవృత్తము
ఖలుఁడు వెదకుఁ గలహకారణంబు. 29

ఆ. గీ. కండకావరంబు గలిగి హెచ్చుచునుండు
యౌవనం బెసంగు నంతదనుక
నేటి పొంగు గాన నెందాక నుండెడు
నింత కొలఁదికాల మే నరుడెస. 30

తే గీ. చిన్నతనమున నందమౌఁ జిలుతనవ్వ
మాట యాడిన మఱిముద్దు మూటగట్టు

నగుగుపెట్టిన సౌందర్య మతిశయిల్లఁ
బ్రాకుచూడిన సంతసపడును దాఁడి. 31

ఆ. గీ. వీణపాట యొంత్రా విపులంబుగా విను
వీరకథల నెపుడు వేడుక విను
నాటపాటఁ జూచి యద్భుతపడుఁ జాలఁ
జిన్న నాఁటిచర్యఁ జెప్పఁదరమె? 32

తే. గీ. పడుచుఁదనమునఁ బయనంబు పరికివచ్చుఁ
దిన్నదంతయు నఱుగును దెలిపి గలుగు
సరససల్లాపములు చేసి సంతసించు
నన్నికోర్కుల సమకూర్చు యౌవనంబు. 33.

ఆ గీ. జవ్వనంబునందు సాగు సౌందర్యంబు
శక్తి హెచ్చుఁ జేయు సత్తికోలఁది
నెట్టికార్య మైన నెన్నిక నెరవేర్చు
నీయవస్థఁ బోల దే దశయును. 34

క. దశ లేవి కావు యౌవన
దశతో సరి తక్కుదశలఁ దా నన్యులకు
న్వశుఁ డగుఁ గనవానికి నిభ
మశకాంతర మఖిలసౌఖ్యమహితత్వమునన్. 35

క. వాన ప్రధానము పంటకుఁ
బానమునకు ముఖ్యమంద్రు పాఱెడుజలముల్
దోనె ప్రధానం జేటికి
సేనాపతి ముఖ్యుడంద్రు సేనకు నెల్లన్. 36

ఆ గీ సంతతి గలవాడు సౌఖ్యము పడయును
గష్టసుఖము లెఱిఁగి కడపు చుండు
నీషణత్రయమున నిక్కట్టు లిముడును
గాచు జవ్వనంపుఁ గాలమందు. 37.

క. పిల్లలశుభకార్యమ్ముల
నుల్లాసమ్ముగ నొనర్చుచున్నధనము వ్రేఁ

దల్లడపడు ధనమెల్లం
జెల్లుటకు విషాద మొందఁ జెడు మతి కూడన్. 38

క. పిల్లలపరిణయములకుం
దల్లి న్యాభాదేవిఁ బెట్టి తాకట్టు కడుం
గొల్లలుగ వ్యయము చేయుటఁ
బిల్లలకు ఋణంబు పెఱుగ బెంగలు హెచ్చున్.

తే. గీ అడుగులబలంబు తగ్గుట నడువలేమి
దృష్టి తప్పుట దవుల నేదియును గనమి
వినుటకై వీనులకు నాస విపుల మగుట
నొదిగియుండును వృద్ధదే నొక్కచోట. 40

క. నడిచిన నలయిక గలిగెదు
నొడ లంతయు ముడతలు పడు నోపిక పోవుం
గడబింక మేమి యుండదు
చెడరా యెన్నాళ్ళకైనఁ జివరదశ నరుల్. 41

క. వీనుల బధిరత గలుగును ;
తా నొకరిం బలుకరింపఁ దడబడు నోర్గ
మాను గన రంగు బెత్తము
నానుకొన న్వంగు నడుము నంత్యావస్థ. 42

చ. పిలిచిన నెవ్వ రేమనరు పీనుఁగు వెంట పిశాచ మంచు రేఁ
చలనముఁ జేయ లేకెపుడుఁ జాటగుచోట నెనిల్చి వాసగ
మ్ములు గడుపున్మదిస్గడువి మోహముఁ జెందియభీష్టసుత్రవ్రు
ల్లలఁ జూచుచుఁగ్రోరిదీఱకసదాపలుబాధలు సెందుముప్పనన్

ఆ. గీ. ఒదవి ముదిమి యొంతో యొదిఁగి యుండుటకంటె
తుచ్ఛవృత్తిధనవుదోఁపుకంటెఁ
బరువు లేని బ్రతుకుఁ బడయుటకంటెను
లేమికంటెఁ జావు లేదు జగతి. 44

క. అధికార మెసఁగువారికి
విధికృతముగ వీఁడు రెపుడు విదితం బిది యా

యధికత బెండ్లై పోయిన
విధివశమునఁ దుదకు నొకఁడు వినఁ డకటకటా!

క. వానలు గురియువిధంబునఁ
దా నెప్పుడు మృత్తిని గనునో తరమె యెఱుంగం
గానక చేయును గార్యము
మానవు తత్ఫలము లెంతమానిసి కైనన్. 46.

క. నాపాటివారు లే రని
పాపములకు భయముపడక వైకముకొఱకే
యేపుగఁ దిరిగెద రారా
బాఁపఁడ చిగిలింత యేపు పాటును గనవే? 47

ఆ. గీ. కన్ను లంద మొందుఁ గాటుక చే, వెల్ల
చేత మేడ గోడ చెందు సిరిని,
బండ్లు సొబగుఁ జెందు వారువమ్ముల, వంగ
మళ్ళు నాఱుచేత మదిక నించు. 48

క. జుట్టే యందము తలకు
న్బట్టయె యందంబు కార్యభవనములకుఁ బో
న్బొట్టే యందము నొసటికి
గట్టే యందంబు చేన గండులు పడుచోఁ. 49

క. కప్పే యంద మ్మింటికిఁ
గొప్పే యందంబు మగువకుం జూడ సతం
బొప్పే యందం బొడలికిఁ
గొప్పయె యందంబు పెద్దఁ గులమున కెల్లన్.

క. పనియే నరునకు ముఖ్యము
పనిపాటలు లేనివాఁడు భారము భువికి
న్పనికిం జెందఁడు పుడమిని
ఘనుఁడు మహావిధముచేతఁగాడు ధరిత్రిన్. 51

క. రాచపని జరప మొదటను
నేచి ఋణం బడిగి సొమ్ము నీతిం గొను నా

నీచుక్రియ ఖలు చెలిమివలెఁ
దోఁచు సుగమ్ముగను మొదటఁ దుదఁ గష్ట మగున్.

క. పరులను మోసముఁ జేయకు
పరులవిషాదంపుఁబనులు పాపము గావే?
పరులకుఁ బలుగోరిక లిడు
తరులవలె న్మేలు సేయ ధన్యత గలుగున్. 53

ఆ. గీ. కాశి గంగ గోద కంచి ప్రయాగంబు
ద్వారకాదు లెంత దవుల నున్న
మనుజు లెల్ల యాత్ర మానరు మహిమచేఁ
గష్ట మెంతొ గోర్కె ప్రాలునంత. 54

ఆ. గీ. ప్రేమ దనకుఁ గలుగఁ బ్రేమ మన్యుల కుండు
మనసు చెడినకొలఁది మఱపు వచ్చు
భేద మూదయ మైన భేదమే యుదయించు
జనుల కిదియె తగు నిసర్గబంబు. 55

క. మన సనెదుపుడమిఱేనికి
సునయుం డగు బుద్ధిమంత్రి సొంపుగఁ జెప్ప
న్విన నిద్ద రైక్య మొందం
బొనరింపవె పను లవయువములు మొనలవలెన్?

క. రాజునకు మంత్రి ముఖ్యుఁడు,
పౌఁజున కగ్రాధిపతియుఁ బ్రజలకుఁ బ్రభువున్,
గోఁజు ప్రధానము ఖలులకు,
పూజ ప్రధానంబు పుణ్యపురుషుల కెల్లన్. 57.

క. వలచిన నొప్పుగఁ దోఁచుం
దలఁచుటకుం గానరాదు తప్పని సరి దా
వలచినదె రంభ యూా నే
జలమందు మునుంగునదియె జాహ్నవి గాదే. 68

క. పెద్దలు చెప్పినచొప్పున
ముద్దుగ విని సేయుపనులు మోఘము లగునే?

రద్దగునె ముగియు నన్నియు
దిద్దుటకును నొప్ప గానిదియుఁ గనఁ గలమే? 59

క. కాలము గడపినవారలు
చాల ననుభవమ్ము గల్గి చతురతతోడన్
బోలనికార్యం బైనను
వేలికగాఁ జేయుదు రనుదిన ముచితముగాన్. 60

క. పెద్దలు చెప్పిన వినమియె
తద్దయుఁ గాపురుషగుణము తగనిపనులనన్
వ ద్దనినఁ జెవిని బెట్టరు
విద్దెలఁ దీఱియును నభినివేశము బలిమిన్. 61

క. అనుభూతము లీరెం డిల
ననుకూలము గానిపనుల నతికష్ట మగున్
విను మనుకూలము సుఖమే
యనుభూ కష్టము సుఖంబు కావఁశిక్షుండల్. 61

క. కలిమి గలదినములందుం
గలియుగముం గానకుండుఁ గడుమోదమునన్
సలిలము నిండినకొలనిం
జలచరములు వ్రాలె సర్వజనముం జేర్చన్. 63

క. లేమిఁదినమ్ములఁ బురుషుం
డేమియుఁ జేయంగఁ జాలఁ డిక్కటులందున్
గామితములు దీఱవుగా
భూమి న్గడుఁ గష్టపడును భోగము గోరున్. 64.

క. అన్యాయార్జితవిత్తము
సన్యాసిం జేయు; మొదటి సర్వము పోవుం
గన్యాశుల్కమువంటిది
యన్యాక్రాంత మయి పోవునది నిల్వ దిలన్. 65

క. న్యాయార్జితవిత్తమ్ము స
న్న్యాయమ్మున నేటఁ బడిన నప్పుడె యొకప

ర్యాయమె దొరకును సదు
పాయము సత్యానురక్తిఁ బాటిలు నెందున్. 66

క. ముక్తీశ్వరతీర్థమ్మున
భక్తిని దానం బొనర్చి పరమేశ్వరునిన్
రక్తి భజించిన జీవ
న్ముక్తి ననుక్షణము దైత్యపురహరుఁ డొసఁగున్.

క. పుష్కరమునఁ దీర్థమ్ములు
నిష్కపటముగా భజింప నేర్చువారల్
పుష్కలమహిమం గందురు
శుష్కవచనములు ఫలంబుఁ జూపవు లవమేన్. 68

క. క్షేత్రముల మహిమ యెల్లన్
యాత్రలు సేవించువార లారయ నిపుణుల్
పాత్రాపాత్రత తెలుఁగుచుఁ
బాత్రులకే యీయఁ జాల ఫలము ల్గలుగున్

క. సర్వము దెలిసినవాఁ డై
గర్వము లేకుండువాఁడె కడుమోద పడున్
సర్వము సమముగఁ దలఁచి య
పర్వమున నపాత్రున కిడ ఫలము గలుగునే? 70

క. మఱియట్టిజోన్న పొట్టును
వృషభములకు వేయఁగాని వేఱుక నములున్
వృషలులు రవంత యైనం
గృషిఫలము వృథా వ్యయింప నీక్షించితివే? 71

క. సత్యము దప్పక కార్యము
నిత్యమ్మును జేయువాఁడె నేర్పరి; శాస్త్ర
వ్యత్యస్తకర్మభీతుఁడు
నుత్యుఁడు నిష్పక్షపాతనుం జెప్ప డిలన్. 72

క. పడుగు పేకరీతిఁ బలుకన్
విదితంబుగ విన్నవారివీనుల కింపౌ,

నదె యొక్కఁ డాడినప్పుడు
మది కెక్కదు పండితునకు మానము వలయున్.

క. ఎప్పటికి నెట్టుగావలె
నప్పటికే యట్టుకాక యది తప్పదుగా,
ముప్పును దాఁట నశక్యము,
దప్పదు గర్మానుభవము దన కెప్పటికిన్. 74

క. వినువక యసత్యవాదికిఁ
బన గల్గుట కేరుగాని పాటింప ఁసీ!
పసరముకంటెను దక్కువ
మసల సౌఖ్యంబు లేదు మహిలో నెందున్. 75

క. మాటలె పస యలసునకున్
గోటే పస విద్యలేనిక్రూరాత్మునకున్
జాటే పస జూదరికిన్
గాటే పస సర్పమునకుఁ గలకాలమునన్. 76

క. తొండమె పస గజమునకుం
గొండియె పస వృశ్చికమ్ము కుట్టుట కెపుడుం
గొండయె పస మన్నెమునకు
నెండయె పస గాలివేఁడి కిల వేసవిలోన్. 77

క. మోస మొనర్చిన నరునకు
దోసము రా కెట్లు మాను దురితముకొలకున్
వేసము వేసికొని తిరుగుఁ
గాసున కాలాయపడును గాంతాధికతన్. 78.

క. కామ మ్ముస్థిర మదియే
ప్రేముడిఁ దలపెట్టకుండ విడుచుచు సరిగా
నీమమున నుండువానికి
నేమాత్రము కొదవ గలుగ దిల నెప్పటికిన్. 79

క. అప్పుడు దలఁచిన భక్తుల
కెప్పటి కేలోటు లేని హితమిడు నీశుం

జొప్పఁగఁ దదేకనిష్ఠత
దప్పక తలపెట్టువారు ధన్యులు ధాత్రిన్. 40

క. కనకము బహునామమ్ములు
గొను భూషణరూపమందు గోనర వివిధ
త్తనువుల నాత్మ యొకండే
తనుభేదం బాత్మ భిన్నతాభ్రాంతి నిజమున్. 41

క. సంశయము గలిగినపుడా
యంశము తగినట్లు తెలియ సడిగినపిదపన్
సంశవిశుద్ధుఁడు తిమిరం
బంశుమ దుదయం బడంచునట్లు హరించున్. 42

క. తనమనసు తనకు నెపుడును
ననుకూలత మెలఁగుచుండు నాలోచనచే
యనరిది కార్యమ్ములదా
రిని బోవం దల్లడించుఁ గృత్యముఁ గాంచున్. 43




క. తనమనసె సాక్షియై త
ప్పను నొప్పను గల్ల నిజము బోధించును గా
డనిపనులు మాను మని మి
త్రునివలె హితమైనమేలిశ్రోవం దెలుపున్. 84

క. ఏతిథి మృతిగాంచెను బిత
యాతిథిఁ బుత్రుండు భక్తి నవనీదివిజ
ప్రీతిగ భక్ష్యములు సదా
కూతముగాఁ బెట్టెనేని కోర్కె ఫలించున్. 85

క. కనకం బొకండె కుండల
మును హారము వలయముఖవిభూషలు నగునో
జనుబరమాత్మ యొకండే
మనుజాద్యఖిలప్రపంచమహిమమ్మౌదున్. 86

తే. గీ. పాదుపెరటఁ బెట్టఁ బైకిఁ బ్రాకుచుఁ బోయి
కాచినప్పు డొరుఁడు కాయఁ గోయు

నట్టు లింటిగోడ లవలివారలు చెడఁ
గొట్టె నింటి కెట్లు గూర్చు కాపు. 87

క. దొడ్డ ఫలమ్ములు గనఁబడ
నడ్డక యేకార్య మైన నతిసౌఖ్యముగా
నొడ్డకు విలంబముగా
దెడ్డతనము నుశకునంబు నెఱుఁగమి ప్రజకున్. ౮౮

క. గొడ్డ ల్లెదు రైన న్నీను
దుడ్డునఁ గొట్టిన విధాన ద్రోహము రాఁగా
నడ్డపడ రెవ్వ రేనియుఁ
జెడ్డది యపశకునఫలము చెప్ప న్వశమే? 89

క. ఒకచెట్టున కా కధిక
మ్మొకచెట్టునఁ బండు ఘన మొకహో యొకచోనే
నొకరీతి నొక్కఁ డుండదు
సకలము గదుఁ జిత్ర మరయ స్వప్నముపోలెన్.

తే. గీ. అల్లనేరేడుపండులు నా(మములును
గొల్లలుగ వచ్చుచుండును గోర్కిఁదీఱఁ
బిన్నపెద్దలు తిందురు పృథివియందు
వీనిఁ బోలెడుఫలములు వేఱు గలవె? 91

ఆ. గి. చెదలు పుట్టఁబెట్టి చెఱిచెదు నిండుల
ముండ్లపొదలు పెరిగి పొలముఁ జెఱుచుఁ
గోడలు వెలిచవిని గులమెల్లఁ జెఱిచెడుఁ
బురుగు నాకి గింజపుట్టుఁ జెఱుచు. 92

క. బత్తయిఫలములు మంచివి
సత్తువ గలిగించు నెపుడు సమముగ దినినం
జిత్తము వచ్చెడు మాధురి
నుత్తమములు పండు లివియె యుర్వి నరసినన్.

క. వెన్నెల భాగ్యమువంటిది
పున్నమరేయంత వెలుగు పూర్ణము ధరపై

నెన్నిక రాత్రులు పక్షము
నున్నతి నస్థిరము లౌ నోహో నెలవెలుగుల్! 94

క. చీకఁటి లేమిం బోలును
బోకకు రాకకును ద్రోవఁ బొడఁగనఁ దరమే?
యాకుం జెట్టుల క్రిందం
బ్రాకు న్భుజగములు దివ్వె రా నడువవలెన్. 95

క. పాలెపుసద్వంశంబునఁ
జాలం గృపఁ బెంచినట్టిజననికి బత్తిం
బూలం బూజలు చేసినఁ
జాలునె జననికి ఋణంబు చనదిఁక మిగులున్. 96

క. జననిం గనకమ్మనునా
జనకు నగస్త్యేశ్వరులను సాగిలి యెపుడు
న్ఘనముగ నమస్కరించెద
వినయమ్మున నుతు లొనరు వేడుకకొలఁదిన్. 97

క. ఈనీతిశతకమందుం
గానీ వేతప్పు లఖిలకవివర్యులకున్
బూని ప్రణామమ్ములు బహు
మానముగం జేయువాఁడ మానక యెపుడున్. 98

క. క్షితి సౌమ్యనామవత్సర
యుత మగుశ్రావణపునెల మహోద్యమముగ నీ
శతకము మితపద్యములుగ
హితమతి రచియించినాఁడ నెఱుఁగుఁడు మిత్రుల్.

క. బంగారురాజు దీని
ప్రసంగేశున కంకితముగ రచియించెఁ, గడున్
మంగళము గలుగు, మనుజుఁడు
బొంగుచుఁ బఠియించువాఁడు బున్నెము గాంచున్.

సంపూర్ణము.



